


చ మ్పి యా రి లీ జ్

# —★ నటీనటులు ★—

| | | |
|---|---|---|
| **అంజలీదేవి** | .... | నాన |
| **ఎన్.టి. రామారావు** | .... | కన్నయ్య |
| ముక్కామల | ... | మహారాజు |
| సదాశివరావు | ... | మహామంత్రి |
| జోగారావు | ... | చంద్రియ్య |
| ప్రిదిగాల | ... | లలితాదేవి |
| గాడేపల్లి | ... | జోగులు |
| పేకేటి | ... | అన్నయ్య |
| నాగభూషణం | ... | చిటి వీరన్న |
| వై. వి. రాజు | ... | నాగులు |
| కాకినాడ రాజరత్నం | ... | కోనమ్మ |
| మాష్టర్ నాగేశ్వరరావు | ... | చిన్నకన్నయ్య |
| ఘంటసాల అమ్మాలు | ... | చిన్న లలితాదేవి |

యింకా

లక్ష్మయ్యచౌదరి, సుబ్రహ్మణ్యాచౌదరి, వెంకటప్పయ్య, కృష్ణయ్య, అప్పిరెడ్డి, రంగనాయకులు, కృష్ణమూర్తి, కంచి నరసింహారావు, రమాదేవి, బి. సీత, సావిత్రి, రాఘవకుమారి, అరుణ, కె. సీత, యల్లమ్మ, బ్లోజిని, సైగల్ నాయుడు, కృష్ణయ్యనాయుడు, ఇతరులు.

S. K. [illegible]
12-5-55

# రేచుక్క

— కథా సంగ్రహము —

యువరాజు కుమారరాయలు పుట్టినరోజు పండుగ.

మహారాజు దేవరాయల కొలువులో మంత్రి సామంతు లందరూ చిరంజీవిని దీవించి కానుక లిచ్చినారు. దేశమంతటా పండుగ వైభవంగా జరిగినది.



సభలో ముచ్చటలన్నీ, మహారాజు తనదేవి మూర్తికి నివేదించినాడు. ఆమె ధరించే రత్నాలహారం, ఆ ప్రతిమకు సమర్పించినాడు. హారం పట్టుతప్పి జారి పడింది. యీ అపశకున మేమో అని ప్రభువు మనసు చివుక్కుమన్నది.

మహారాజు ఉల్లాసంగా ఉన్నారు కదా అని, మహామంత్రి, ఏకాంతాన తన మనసులో కోరిక విన్నవించినాడు. తన కుమార్తెను కోడలినిగా స్వీకరించ మన్నాడు.

కాని, అంతరమెరుగక పలికినాడని, మహామంత్రిమీద ప్రభువు మండిపడినాడు. అప్పటికి మెదలక ఊరకుండి, మంత్రి యీ అవమానానికి తీవ్ర ప్రతీకారం తలపెట్టాడు. సమ్మనబంటు నాగులు తోడ్పాటుతో.

ప్రతీకారం ఏమిటి? 'కన్ను తెరిచాం! కావలసిన కట్టుదిట్టం చేస్తాము. రాణివ మన చేతిలో ఉంది. రాజ్యము మనచేతిలోకి వస్తుంది.

లేపిపాటికి రాజూ ఉండడు! రాజవంశమూ ఉండదు!' – ఇది మహామంత్రి ప్రతిజ్ఞ.

ప్రతిజ్ఞ నెరవేరింది. చిరంజీవితో దేవాలయానికి వెళుతున్న మహారాజును మంత్రి అనుచరులు బంధించారు. ప్రభువువెంట వెళుతూన్న చిటివీరన్న అనే వీరుడు కుర్రవాడిని అంకించుకొని దౌడు తీశాడు. తరుముకు వచ్చేవారిని ఏమార్చేందుకు, కుమార రాయలను కుమారస్వామి మర్రిచెట్టుదగ్గర దాచి, తాను మరోదారి పట్టాడు.

మహారాజును, మంత్రి చెరలో పడవేసినాడు. మర్రిచెట్టు దగ్గర వున్న చిన్నవాడు, కదిలిపోగా, నాగేంద్రుడు కాటువేశాడు. మొక్కులు చెల్లించుకునేందుకు వచ్చిన జోగులు, కుర్రవాడిని తన గూడెముకు తీసుకొనిపోయి, నత్తేమున్న నాగేంద్రుణ్ణి తలచుకొని, పిల్లవాడిని బ్రతికించుకుని, ఫలానాఅని రొమ్ముమీద వున్న పుట్టుమచ్చను చూసి ఆనవాలు పట్టి, అతిగోప్యముగా, వీరోచితమైన విద్యలు నేర్పుతూ సాకుతున్నాడు.

పిల్లవాడి జాడ తెలియక, చిటివీరన్న యింటికి తిరిగివచ్చి భార్యతో జరిగిన వృత్తాంతము చెప్పి, పసికందు నానాను రొమ్ముకు హత్తుకుని - పులిపిల్లల్లే బ్రతకాలమ్మా!' అని దీవించి, తరలిపోయినాడు.

—రాత్రివేళ మంత్రి మందిరము ప్రవేశించి, దొరికిపోయి ప్రభువున్న చెరలోనే పడినాడు.

నాగులు సాయంతో మంత్రి నాటకమాడి, ప్రజలను మభ్యపెట్టి హడలగొట్టి సింహాసనము ఆక్రమించుకున్నాడు. పంపిన భటుల మాటలునమ్మి, కుమారరాయలు మరణించాడనుకుని, నిశ్చింతగా ఉన్నాడు.



పదహారేళ్ళు గడిచినవి.

చిటివీరన్న కూతురు నానా, పెరిగి పెద్దదై, ఆటపాటలతో నగరములోవారిని

రంజింపచేస్తున్నది. కుమారరాయలు, కోనలో కన్నయ్య అనే పేరున యౌవనుడైనాడు. కొండకోనసంగి అన్నయ్య అనే యాదవుడు, కన్నయ్యకు ఆరవప్రాణం. కన్నయ్యకు పావురాలాట అంటే పరమప్రీతి.

చెరలో, చిటివీరన్న చివరికి మరణించాడు. బ్రతికి ఉన్నన్నాళ్ళూ ప్రభువుతో ఒకటే ఆలాపన - 'ఎలాగైనా తప్పించుకుందాం-బయట పడదాం! పగకోసం కాదయ్యా! ప్రజలకోసం -!' -ఆ మాట మీదనే, మహారాజు, భటుల కన్నుగప్పి - వీరన్నను చుట్టబెట్టిన గోనె పట్టాలో తాను చేరి, తప్పించుకు బయటపడ్డాడు.

భటులు యీ మోసం కనుక్కున్నారు, మరునాడు కాని, నిజమే చెబితే తమతల లుండవని, - మహారాజు మరణించాడని మంత్రికి మనవి చేసి, అతడువచ్చి పరకాయించి చూడకుండా వచ్చిన ఎలుకలను గదిలో వుంచారు. మహామంత్రి నాగులుతోసహ వచ్చి, ఆవాసన భరించలేక, తిరిగి పోయినాడు.



తప్పించుకున్న మహారాజు నగరము చేరుకొని, నానా నాట్యమయూరి, దిక్కూ మొక్కూ లేనివాడుకద అని ఆ పిల్ల ఆదరించగా, ఆమె కుటీరములో తానెవరో చెప్పకుండా, తలదాచుకున్నాడు.

కోటలో-లలితాదేవి పుట్టిన రోజు పండుగ. పేరంటాళ్ళందరూ రావలెనన్న చాటింపు విని, నానా వెళ్ళి, కావలివాళ్ళ

తనుమొరగి, రాకుమారిని పలుకరించి, ఆటపాటలలో మెప్పించింది. ఇంతలో మహామంత్రి దయచేయుగా చెలికత్తెలందరూ వైదొలగినారు. నానా, రాకుమారి పీఠము వెనుక నక్కి కూర్చున్నది. మహామంత్రి, మునుపటి మహారాణి రత్నహారాన్ని కుమార్తెకు యిచ్చినాడు. అందుబాటులోవున్న, హారాన్ని నానా తన వశం చేసుకున్నది.

హారము పోయిందని, కోటలో గందరగోళమైనది.

వెదకి తెచ్చినవారికి బహుమాన మిస్తామని చాటింపు వేయించినారు.

అది విని, కన్నయ్య అన్నయ్యతో కలిసి, కోటకు వెళ్ళి, తాను హారం వెదకి తేగలనని పగ్గిలు పలికి వచ్చాడు.



కాని, ఎక్కడ వెదకడం?

అన్నయ్య తనంతట తాను వెదకబోయి, తలప్రాణం తోకకు తెచ్చుకున్నాడు.

తలవని తలంపుగా హారము కన్నయ్య కంటపడ్డది. చేత చిక్కించుకున్నాడు, కాని దొంగముట్టుకు నాటకమాడి తప్పించుకుంది.

కన్నయ్య కోటకు వెళ్ళి హారము చంద్రయ్యచేతికి యిచ్చాడు. రాకుమారికి అందజేయుమని చంద్రయ్యకు యిచ్చినాడు. చంద్రయ్య అంటే నాగులు కొడుకు: పినరైన ఉత్తరకుమారుడు: అతడంటే కోటలో వారందరికీ, రాకుమారి చెలికత్తెలకేనహా అలుసే.

రాకుమారికి, హారం చేరిందా - లేదు!

మళ్ళీ నానా మాయంచేసింది.

ఎలా మాయమైందా అని అందరూ తబ్బిబ్బుపడ్డారు. కాని,- కన్నయ్య యిది నానా పనే అని గ్రహించాడు.

నానా యిల్లెక్కడో కనుక్కున్నాడు. ఎత్తుకు పైయెత్తు వేసి, - హారం అందుకుని, రాకుమారికి సమర్పించాడు. రాకుమారి, ఒక వరాల సంచిని,- తన మనసు తెలిపే లేఖతో - కన్నయ్యకు బహూకరించినది.

గూడెంవారిని నాట్యముతో మెప్పించి, నానా, ఆ వరాల సంచి అందుకున్నది, ఆలేఖ కన్నయ్య తనమీది మమతతో వ్రాసినాడనుకుని- రాత్రివేళ వెదుక్కుంటూ గూడెముకు వెళ్ళినది.

అప్పటికి నిజం తెలిసింది. కన్నయ్య, నానా బ్రతిమాలుతున్నా వినక అంతఃపుర ఉద్యానము చేరుకుని, రాకుమారి చనువుమాటలాడగా,- కూడదని ఖండించి, మరలి పోతూండగా-

రాజభటులకు చిక్కాడు, చెరలో పడినాడు. హారం నెపాన ఆడుతున్న నాటకమేమా? ఆడించేవారెవరా? అని మహామంత్రి, నాగులూ తికమక పడ్డారు.

కల్లబొల్లి మాటలాడి, నాగులు చెరసాల కావరులవల్ల నిజంతెలుసు- కున్నాడు. మహారాజు మరణించలేదు. ఇది అంతా ఆతడాడించే నాటకమే కావచ్చును. కన్నయ్య మహారాజు అనుచరుడు కావచ్చును.

కన్నయ్యను నిలవదీసి గద్దించారు. చిత్రవధచేస్తామని బెదిరించారు.

నానా, యీ కలాపమంతా పొంచి విన్నది. తన యింటికి పరు- గెత్తుకు పోయింది- హఠాత్తుగా, మహారాజును పోల్చుకున్నది.

కన్నయ్యకు వచ్చిన కష్టం విని, మహారాజు ఉపాయముచెప్పాడు.- నానా కోటకు ఉరికింది. రాజముద్ర సంగ్రహించి, ఆజ్ఞాపత్రము వ్రాసి భటులకు చూపి కన్నయ్యను తప్పించింది. కాని, తాను చిక్కుపడ్డది.

చంద్రయ్యకు యిచ్చకాలుచెప్పి - ఆడవేషము కట్టించి, రాకుమారి సముఖములో వదిలి - నానా యీ తతంగము అంతా చేసింది. చంద్రయ

య్యకు తగిన శాస్తి చెలికత్తెలతో చేయించి, రాకుమారి, మరోసారి కన్నయ్యను బ్రతిమాలాలని చెరసాల ప్రాంతానికి రాగా-కన్నయ్య లేడు!

తప్పించుకున్న కన్నయ్య మహారాజును కలుసుకుని రాజముద్ర అందించాడు., ఆడపిల్లను ఆపదలో వదిలి వచ్చినందుకు మహారాజు నిష్ఠురము లాడగా, ఉద్రేకము పెరిగి యిద్దరూ కత్తులు కలిపారు. మహారాజు తన కుమారుణ్ణి గుర్తించాడు.

కన్నయ్య మహారాజు మాట వినిపించుకోకుండా నానా కోసం కోటకు వెళ్ళాడు, తానూ పట్టుపడ్డాడు.

ఆ రేచుక్కనూ, యీ పగటి చుక్కనూ కలిపి అంతము చేయటానికి మహామంత్రి నిర్ణయించాడు.

ఇక్కడ మహారాజు- ఒక్క పరుగున జోగులవాడకు చేరి. గూడెము వారందరిని కూడగట్టుకున్నాడు.

మహారాజును బంధించడానికని భటులతో బయలుదేరిన నాగులు సమయానికి అక్కడకుచేరి, - పరిస్థితులు విషమించినవని తెలుసుకుని, వెంటనే పథకము మార్చి, తన రాజభక్తిని ప్రకటించుకున్నాడు. అందరూ కలిసి కోటమీదికి ఉరికారు.

కోటలో - కన్నయ్య సొమ్మసిల్లి పడినట్లు నటించి, కత్తి చేజిక్కించుకుని భటులతో కలియబడినాడు. మహామంత్రిని ఎదుర్కొన్నాడు.

పోరాటములో, మహామంత్రి నేలకూలాడు. కూలిన వేళకే- మహారాజు గూడెమువాళ్ళతో అక్కడకు వచ్చి వాలినాడు.

మహామంత్రి కొనఊపిరితో వున్నాడు. నాగుల కుత్రంతము గ్రహించాడు. ఒక్కపోటుతో నాగుల్ని కూల్చేశాడు. తన బిడ్డను మహారాజుకు అప్పగించి, తనతప్పు తనతోనే అంతం చేసుకున్నాడు.

అందరూ కష్టములు గడిచి గట్టెక్కినారు.



## ★ పా ట లు ★

లలితాదేవి :

ఎక్కడిదీ – !
ఎక్కడిదీ అందం! ఎవ్వరిదీ ఆనందం!
వెలిగే అందం – చెలరేగే ఆనందం!
ఎక్కడిదీ అందం!



లోకంలో కన్నెలకూ లోపా లెన్నో చిన్నది
మారుని జవరాలికైనా –
వంకలు దిద్దే వన్నెది
వెన్నెల దివ్వెల్లె – మెరుపు తీవల్లె
విరు మల్లెపూవు లెత్తు – తూగే
బంగారుపాప

ఎవరో!
ఏలేవారెవరో – కల లేలేవారెవరో!

ఎన్నెన్ని ఊహలు – కొసరే కోరికవేళ
మేల్ మేల్ నెయ్యములు – మిడిసే వేడుకవేళ
చిక్కని మక్కువల – చక్కిలిగింతలవేళ
ఊహల ఉయ్యాలలో – ఊగే బంగారుపాప
ఎవరో –
ఏలేవారెవరో – కల లేలేవారెవరో
ఏలేవారెవరో!

నానా : –

ఎటు చూచిన బూటకాలే – ఎవరాడినా నాటకాలే
తలక్రిందుల మారి – కలికాలంలో
చెడిపోలేని వారూ – చేతకానివారే!
అంటుంది నానా – నమ్మమంటుంది నానా!!



దూకలనంచి రొందన గ్రుచ్చితే
రొమ్ము విరుపొచ్చిందా మొన
గాదా
కరకుందా - కాళ్ళకు కదనుందా
పరతీయని చుర కత్తికి
పదనుందా
మనలో-కదనుందా పదనుందా

పాగా దుఖావ్ పగిడిపెట్టావ్
వేషం కట్టావ్ మీసం మెలే
శావ్ దొరకొడుకా !!
అడవుల్లో పులికి ఆకలేసి
నీ మదికి ఒక దుముకు
దుమికితే

ఎలబడి కలబడతావా ?
లాలించి లంచం పెడతావా — హెరాయ్

లేకలేక ఓపిక చేసుకు
రాకరాక రానే పచ్చావ్ గాని — ఏం లాభం !
మీ జగం కాదు — ఈ యుగం వేరుతాతా !
తరాల్ మారి నం — బరాల్ మీరినయ్ తాతా॥

తాతా :

నీ నరి నీవేనమ్మా వయారి!
పుట్టిననాడే భూమికి పండుగ
నువ్వు - పుట్టిననాడే భూమికి పండుగ
చేపట్టేవారి జన్మే — పండుగ ॥నీ నరి॥

చూపులతోనే లోకాలేలే
సురతాణి! అందాలరాణి!



చందమామ కన్న ఎంతో
చక్కని దానవమ్మా !
చక్కని దానవమ్మా – చక్కని
దానవమ్మా ॥నీ సరి॥

రవ్వల నవ్వుల పువ్వుబోణీ-మహా
రాజుకు నీవే సంపదవమ్మా
పరువంలో - గరువంలో - మా
కన్నెకులానికి దీవెనవమ్మా ॥నీ సరి॥

కన్న :
బలే బలే పావురమా –
గడుసూ పావురమా !
ఎగరాలి సరదా తీరగ
పావురమా ॥
మబ్బులకు సరాసరి
ఎగరాలి హంసలా
చిక్కాలి నీకూ చక్కని చుక్కలూ
ఆకసమంతా నీరాజ్యమే
ఓ పక్షి వేయించగ బలే మొనగాడూ
మనకన్నా ఘనుడూ ఏనాడులేడు
బలే గడుసరి లేడు –॥

ప్రతిపూటా పంతాలే రోజూ పందెములే
అయితేనేలే హాయీ – ఈ రవ్వలకు
కాలికి తోడా తొడించుకో
కనుచూపు మేరల అందాలన్నీ చేదుకో
మనసైనా దినుసు ఏ జాతదైనా
అందిన మరీ బాగూ – ॥

కన్న :



ఒంటి-రొంటరిగ పోయేదానా
ఒకమాట వినిపో
ఒకమాట విని పో –
అదే పాడే యీదున
తోడుండాలి - సైదోడుండాలి—నానా
ఓ నానా –
అదిగదిగో చిట్టడవి - అల్లదిగో నట్టడవి
సింహాలుంటయ్-శివంగు లుంటయ్
తేములుంటయ్ దేబాములుంటయ్
నానా—తేములుంటయ్ – దేబాము లుంటయ్
చూసుకోమంటి –
చూసుకోమంటే ఉలిక్కిపడతావ్ – నానా
ఓ నానా – ॥
తెర తెరగా దొరికిందంటూ
ధీర మనసూ దోచుకుపోతావ్
చిన్నె సంతే కన్నెత్తనంటావ్
పలుకరిస్తే కన్నెత్తనంటావ్
ఓ మైనా – యీ మైన
చిటికి మాటికి కోపాలైతే
చిరాకు పెడితే చిక్కున పడతావ్—నానా–
ఓ నానా – ॥

పాట :



అయ్యోవ్ బంగారు సామీ!

ఓ రబ్బి బంగారు సామీ!

ఓ రయ్యో బంగారు సామీ॥

గువ్వలాటిదాన్ని — మల్లెపువ్వు
లాటి చిన్నదాన్ని

రవ్వలేం వేసుకోనురో — రాయుడా!

రవ్వలొద్దురా దొర నవ్వు నవ్వరా॥

ముంతమీద ముంతపెట్టి - రాజా
ముల్లెదీసి మూటగట్టి
ఉట్టిమీద దాచపెట్టి - అట్టే తొంగుండగానె
ముంగిలాంటి గండుపిల్లి మూట దాటిసెరో-
మూటలో ఏం పోయె - చింతకాయ్॥ —

తంటాలమారి గువ్వ చేరువకు రాకపోతే
దొరికాయ్ తెన్నుకాయ్ - కాయ్ రాజా కాయ్!
సీతమాని జాడచూసి నీనీటి వాటమేసి
పట్టుకో — చెట్టబట్టుకో!

దప్పికంటె ఒప్పుకోకు — దూరంగా తప్పుకోకు
చిక్కురా — రేచుక్కరా!
గువ్వ దక్కాలంటె — గూడుకట్ట మక్కువుంటె
కాటమ రాయుడా — కంటా కట్టెయ్యరో!

బాలా :



అయ్ సంబరమే –

అయ్ సంబరమే-అయ్ పండుగలే

చిన దాన! వన్నెదాన!

నిను రమ్మనెనే యిది నమ్మకమే

మనసైనవాడె ఆరాజా

మరేసారి పాదులాడ - వేడుకైనదే ఏమో

ఆ జాణకు!

సరేకాని యింకోపాట పాడించనా

దరిచేరి యింకో ఆటా ఆడించనా

కంటికి బందం వేసే – బిలేపిల్ల గిర

ఎటు మారిపోవునే ఏమో!-॥

తనే అందగాడేలే - చిందులాడి చిన్నదాన్ని

ఒక్క చూపులోనే మెచ్చి తల్లకిందులాయెనే

దారికి రానే రాని - సరాగాల బాటే

ఎటు మారిపోయినా కాని - అయ్ సంబరమే॥

లలితాదేవి :

సొగసేమో - మనసేమో -

గారామో అది మారామో

ఆ తీరే వేరేమో-॥



లాలనగా రా రా రమ్మని
మాలిమైన జవరాలిపైన
జాలి లేదో - మరి మరి బ్రతి
మాలించు కోవాలో॥

నేరని తనమా - నెరజాణ తనమా!
సరసాల వేళలో చెరసాలే సుఖమేమో॥



పాటలు పాడినవారు:
పి. లీల, ఎ. జి. కృష్ణవేణి, (జిక్కి) ఘంటసాల.



రికార్డులు:
హెచ్. ఎం. వి. కొలంబియా.

# ★ నిర్వాహకులు ★

| | |
|---|---|
| కథ : | ఘంటసాల బలరామయ్య |
| రచన : | మల్లాది రామకృష్ణశాస్త్రి |
| సంగీతం : | అశ్వత్థామ |
| ఛాయాగ్రహణం : | పి. యల్. రాయ్ |
| శబ్దగ్రహణం : | ఏబెల్‌జీవా, విశ్వనాథ్, రామచంద్రరావు |
| సాంగ్ అండ్ రికార్డింగ్ : | టి. యస్. రంగస్వామి |
| కళ : | ఎస్. వి. ఎస్. రామారావు |
| నృత్యం : | పసుమర్తి కృష్ణమూర్తి |
| మేకప్ : | హరిబాబు, కే. నాగేశ్వరరావు |
| ఎడిటింగ్ : | జి. డి. జోషి |
| ప్రాసెసింగ్ : | రంగనాథన్ |
| స్టిల్సు : | సత్యం |
| ఆర్కెస్ట్రా : | గీతాంజలి |
| సహాయ దర్శకుడు | జి. యన్. స్వామి |
| ప్రొడక్షన్ చీఫ్ : | ఈ. పి. హెచ్. ఎస్. మూర్తి |
| కాస్ట్యూమ్సు : | పి. నారాయణరావు |
| స్టూడియో : | రేవతి, ప్రకాష్, నెప్ట్యూన్ |
| నిర్వహణ : | టి. వి. యస్. శాస్త్రి |

నిర్మాత :

**ఘంటసాల కృష్ణమూర్తి**

దర్శకత్వం :

**పి. పుల్లయ్య, బి. ఏ.**

శ్రీ పద్మశాలి ప్రింటింగువర్క్సు, విజయవాడ-2.